# దేవదత్తం

రచయిత:

మల్లాది లక్ష్మీనరసింహశాస్త్రిగారు.



పబ్లిషర్:

కంచుల గోవిందం,

జనరల్ బుక్ డిపో, రాజమండ్రి.

1945

 [వెల 0-8-0

# ముందు మాట!

ప్రపంచంలో పైకి ధర్మపరులుగాను, నీతివర్తనులుగాను, న్యాయస్థులు
గాను కనిపించుతూ— లోలోపల మెన్నో చెడ్డపనులు చేస్తూ—
వాటిని కప్పిపుచ్చడానికి- రక్తసంబంధీకులను; మనకింట్లో కలిసి
మెలిసి తిరిగేవారినికూడ మోసంగించి బ్రతికే వాళ్ళున్నా
రన్న సంగతి చాలామందికి తెలిసినా స్త్రీ పురుషజాతు
లలో ఎందులో నిట్టివా రెక్కువమంది యున్నారో
తెలిసినవారు తక్కువే. అందలి నిజా నిజాలను
సహేతుకంగా యిందు చర్చించి లోకానికి
వెల్లడి చేయడమే ఈరచనకు ప్రధానా
శయం— కాని యీరెండు తెగల
లోను ఎవరు జయమందుతారో
అనే సంగతిని చదువరులు
స్వయంగా తెలుసు
కోవాలి—!!

ఇట్లు,

రచయిత- మల్లాది.

శ్రీనివాసా ప్రెస్, రాజమండ్రి. సెప్టెంబరు 1945—1250

౧

"అమ్మగారూ! అయ్యగారు జాడలేదేమండీ?"

'కమాను వెళ్లారు'

'ఎప్పుడొస్తారండి'

'ఫలానప్పుడొస్తానని చెప్పలేదు' కాని బహుశా రేపురావచ్చు'

'సరేలెండి'

'నీకు అయ్యగారితో పనేమొచ్చింది'

'కూస్తంత కాగితంముక్క రాసిపెట్టాలండి'

'ఏమిటా కాగితం'

'లోటండి,

'లోటేమిటీ నీమొహం- లోటుకాదు నోటు—'

'శూద్రపోళ్ళం మాకేం తెలుస్తుదండీ— రాతా— కోతా— చదువా— సంధ్యా'

'ఎవరికేనా డబ్బు బదులిస్తున్నావేమిటి?'

'కూలిముండాదాన్ని నాకు డబ్బెక్కడదండీ'

'అప్పుపుచ్చుకుంటున్నావా?'

'నాబోటిదాని కప్పెవరిస్తారండి'

'మరింక ఆరాయనలసిన కాగిత మేమిటి?'

'నాక్కాదండి. నాకు తెలిసినో రొకరున్నారండి. ఆరికి రాసి పెట్టాలి. కాగితం- అంటించేవిళ్ళ కొనుంచారు. అయ్యగారు రాసిపెడ తారేమో అడగమందండావిడ'

'ఆడావిడన్న మాట- రాసేమగాళ్లులేరా?'

'మొగోరులేరండి'

**'విధవదా ఏమిటీ?'**

"వెధవోరుగాదండీ! మొగాన్ని బొట్టు- రంగంచు చీరలూ-కాళ్లకి మెళ్లోకి వస్తువులూ ఉన్నాయండి"

"నీకెల్లా పరిచయం"

"ఎప్పుడేనా ఎల్తానండి"

"వెళ్ళి—"

"కాస్సేపు కూకుంటానండి- చేతుల్లో ఏదో రాలుస్తుంది"

"పిల్లలున్నారా?"

"పిల్లాలేరు— జల్లాలేరు"

"తిండెలా గడుస్తుందే"

"ఏమోగానండి డబ్బు బాగా ఖర్చుపెట్టుందండి?"

"ఇంకేమైనా యితర సంపాదనుందా?"

"అంటే నాకు బోధపడలేదండి"

"తెలియదంటే- ఎవర్నయినా మఱిగిందా అని'

"నాకెలా తెలుస్తుందమ్మగారూ!"

"దొంగముండా! ఎప్పుడేనా పెళ్తాంటానన్నావు. కూకుంటానన్నావు. ఆమాత్రం పసిగట్టలేదు"

"నేనున్నప్పుడోసూ రానేదండి'

'అయ్యగారినే కాయితం రాసిపెట్టమనడగడమేమి! అయ్యగారు దానికెల్లా తెలుసు'

'నేనే చెప్పానండి. మాఅయ్యగారు కోర్టుకెడతారండి బాగా రాస్తారని'

"అసలయ్యగారూను అక్కడెందుకొచ్చింది?"

'చెప్తునాన్నగదండి- కాయితం ఓటి రాయించాలే, ఎవరూ కుదరలేదంటే చెప్పానండి'

'అంతేనా ఇంకేమయినా అడిగిందా?'

'ఇంకేమనుగుతారండీ- కాయితంగొడవే'

'అయ్యగార్ని గురించి యేమీ అడగలేదూ!'

'కాయితం బాగారాస్తారని నచెప్పినతర్వాత ఏవో అడిగారండి'

'ఏమిటది?'

'డబ్బుపుచ్చుకొనేవాళ్లు దగ్గిరుండగా రాయాలటండి ఆకాయితం— ఒక్కమాటొస్తే బాగుండును మనింటికండండి'

'అంటే నువ్వేమన్నావ్'

"ఆరల్లారారు. డబ్బునొస్తారు— అన్నాను"

"దానికేనంది?"

"కోర్టుకాయితాలు డబ్బుచ్చుకు రాయరా? అల్లాగే రాసినందుకు నేకూడ డబ్బిస్తాను. ఎందుకు రారథదండి"

"తనింటికొచ్చి రాయాలేం కాయితం— అదేరాకూడదూ!"

"ఆవిడెక్కడకీ యెల్లదండి— సినిమాకిమాత్రం పోతుందండి"

"ఒక్కర్తేనా?"

"ఆ! బండిమీదే ఇక్కడికి రాకూడదూ- అంత కాయితము రాయించుకోవాలంటే'

"నేఅల్లాగే చెప్పానండి'

"ఏమంది"

"ఎంతడబ్బయినా యిచ్చి యిక్కడ రాయిస్తాగాని నేకదలనంది——"

"దానికర్మంగాని- అంటూ, చెంబులూ శుభ్రంగా తోలిచావా'

'బాగానే కడిగానండి'

"అయితే నువ్వువెళ్లు— నేతలుపేసుకొని— స్నానంచేసి పూజ్జేసుకోవాలి.'

'ఇయ్యేళేంపూజండి."

"ఇవ్వేళ కొత్తగాచెయడంలేదు. రోజూను'

'నేనెడుతున్నాను. తలుపెయ్యండి—

అంటూ దాసి సూరి సింహద్వారందాటి రెంషడుగులేసింది. సుగుణ తలుపేసుకొద్దామని పీధిగుమ్మల్లో కెళ్ళింది. సూరి రోడ్డుమీాద నుంచుని ఇంకోదాసీ దానితో ఏదో పేచీపడుతోంది. అంతట్లో కే సుగుణయింటికెదురుగానుండి ఓషోకేళా చప్పట్లు వాయిస్తూ— ఈల వేసాడు. సూరి ఆయీాలవేసేమనిషి కేసి చూసింది. ఆమనిషి సరిగా సుగుణమ్మగారింటి కేసి చూస్తూనే- చప్పట్లుకొట్టి ఈలేస్తున్నట్లు పసి గట్టింది. ఓమాటు పీధిగుమ్మం కేసి మొహం తిప్పింది. సుగుణ చిరు నవ్వునవ్వుతూ సింహద్వారం దగ్గిర నిలబడుంది.

సూరికి కొంచెం అనుమానం తోచింది. ఆపేచీపెట్టేదాసి బంక విషాణంగా దాన్ని వదలకుండా—

'నేంచేసి జీతంచాలదని యిడిచిపెట్టినింటికి నువ్వెందుకు సక్కా- వొచ్చినావే'

"నన్ను పిలిస్తే వచ్చాను. అరినడుగు'

'అర్నెందుకడుగుతాను—నీమొహం బోర్లేసి ఈడుస్తాను'

"మాటలు తిన్నగా రానియ్యిగొల్లి—'

"నోట్లోగడ్డెడతాను— కాళ్లిఅగ్గొట్టిస్తాను. అరిగుమ్మంలోకి రేపురా—"

'సూద్దాంలే- నీకేజరుగుతుందో- నాకేజరుగుతుందో- అపని'

అని దానిమాటలకు సూరి సమాధానం చెపుతూనూవుంది. సుగుణమ్మగారింటి కేసి ఆషోకేళాపురుషుడు కేసీ- వారగంటచూస్తూనే వుంది. సుగుణకి సూరక్కడున్నట్టు తెలియదు. పీధరుగుమీాద స్తంభం చాటు. ఆషోకేళా చప్పట్లుకొట్టి- ఈలేసిందానికి- సుగుణ ఏంజేసిందో ఆపురుషుడు చడావులు చప్పుడుకాకుండా సుగుణయింటి సమీాపంలో

కెళ్ళడం- చూసి- యింకాకొంచెం ముందుకొచ్చి ఆయింటివేపు ఓర కంటితో చూస్తూ— వంగుని ఏదోయిది జేస్తోనట్టు నటిస్తోంది. చటా లున ఆపురుషుడు అయ్యగారింటో దూరడం- సుగుణమ్మ తలుపెయ్యా డము కళ్లారా చూచింది.

అలాగే రోడ్డు మీదనిలబడి— ఈషోకేళాముగాడు చప్పట్లె య్యాడం—ఈలెయ్యాడం—ఆవిడ ద్వారంలోకి రావడం—ఈయన యిం ట్లోకి దూరడం—సిత్రంగావుం దే—

అని ఆలోచిస్తూ ఇప్పుడేంటి చెయ్యాడం—మనకెందు కీవూసని పోవడమా-ఏదేనా నెపంపెట్టుకుని—అమ్మగార్ని పిలిస్తేనో—దాసీముం డని నాకెందుకీసంత—అనేంటి- అయ్యగారు లేనప్పుడా యింటోకి పరాయి మొగాడు పగలు దూరడం—నామనస్సు ఒప్పుకోటంలేదు— అని తలపంకించి గబగబా మళ్ళీ సుగుణమ్మగా రింటిద్వారం దగ్గిరి కొచ్చి రెండోకిటికిటీ దగ్గిర నిలబడింది పిలుద్దామా అని అంతట్లోకే లోపల్నుంచి గుసగుసలు వినిస్తున్నాయి.

'ఇవ్వేళ చాలా పెందరాళె వచ్చారేం?'

"ఏంతోచక—ఉండబట్టలేక"

'అంత ఉబలాటమా?'

'కాదుమరి—నీకు లేదేమిటి?'

'లేక పోడ వేమిటి?'

మరింకేం—ఏదీముందొక ముద్దు'

'ఉండండి ఫలహారం అయింతర్వాత'

"ఏమిటా ఫలహారం కడుపునిండుగానే వుంది కాని పట్రా"

'వేడివేడి ఉపమా—పెసరట్టు—పూరీకూర'

'ఇవెప్పుడు చేశావు,

'పొద్దున్నే లేచి చేశాను'

'మరి తిన్నే దేం'

"ఎవరి కోసంచేశానో వాళ్ళు తినద్దూ"

"ఇద్దరం తిందాం—కూర్చో"

అని రెండు బుజాలు పట్టుకొని సుగుణని కుర్చీలో కూర్చో పెట్టాడు మోహన్. ఇద్దరూ ఫలహారాలు పుచ్చుకొంచారు. సూరికివ్వన్నీ వినిపిస్తున్నాయి ముక్కుమీద వేలేసుకుని ఎంత్కైనా తగువారు డబ్బు న్నోళ్ళు గొప్పోళ్ళు ఛీ! ఎదవబతుకు

అంటూ మెల్లిగా గుమ్మం దిగిపోయి మనసొప్పక మళ్ళా వెళ్ళి కిటికీ దగ్గిరే నిలబడింది. మళ్ళీ మాటలు.

'ఎంతలో తయారవ్వాలి నిముషం,

'ఎక్కడికి వెళ్తున్నావు,

'కుళాయి దగ్గర కెళ్ళి ఇప్పుడే వస్తాను'

'నేనూ వస్తాను పదూ'

"ఎందుకూ"

'చూడ్డానికే నే'

'రావద్దు'

'ఎందుచేత'

"గప్పుని నీళ్ళు పోసుగోస్తాను"

"స్నానాలగదిదాకా యెందుకు అక్కడే పోసుగుందూ!"

"సబ్బుతో రుద్దుకోద్దూ"

"నేరుద్దుతాలే"

"చా అదేమిటి"

'తప్పా! ఎవరి వస్తువుల నెవ్వరుంచారు. చూచుకో కూడదా!'

'వొద్దూ! సిగ్గేస్తుంది'

'నాదగ్గిర సిగ్గేమిటే! ఎవరెరగంది'

మరీ అంత పట్టు బయిలా'

'అలాగే వుండాలి!'

'మోటసరసం'

'నీటు సరసమే'

'వెళ్ళిరావాలి'

'నీ యింట్లో నీయిష్టంగాని నాయిష్టమా?'

'అప్పుడే కోపంవచ్చిందా?,

నాకోపం నిన్నేంచేస్తుంది నన్ను చ్చేసిన పని తీర్చుకుంటావ్,

'మీరు వెళ్ళమంటే నే వెళ్తాను,

'నీయిష్టం అని చెప్పలేదూ'

అనటతోనే సుగుణ తొందరగా స్నానాల గదిలో కెళ్ళి కట్టు పుట్టం విప్పేసి కుళాయి దగ్గర నీళ్ళోసుకొని సబ్బుతో రుద్దుకుంటూంది. మోహన్ గదిలో ఒంటరిగా వుండలేక నెమ్మదిగా అడుగులేస్తో స్నానాలగది దగ్గిర కెళ్ళి తొంగిచూసి లోపలి కళ్ళాలనివున్నా కొంచెం చేజంకి అక్కడే నిలబడ్డాడు.

సూరికిటికీ దగ్గిరుండి సంభాషణంతా వింది స్నానం చేసి పూజ్జే స్తానంది నాతోటి ఇదేగాబోలు పూజ-ఆయన ఊరికెళ్ళాడు గదా అని యీవిడిష్టం వొచ్చినట్లు కూలాసాగా సాగిస్తోంది-రంకులాటం పైకి స్నానాలు-పూజలూ-పతివ్రతల్లామాటలు-ఛీ! ఎనవబతుకు- ఈయింటో దాసీ తనం చేస్తే పాపం-ఒగ్గేస్తే-అయ్యగోరు మంచోరు-నన్ను చూసి పాణాలిస్తారు-ఈఅమ్మకి దే పోయికాలం-అయ్యగారి కంటె అందగా డేటి—ఈకూసుగాడు—ఆయన చుక్కల్లో చంద్రురుడంటే సమ్మాలి—అమీసకట్టు ఆ కాఫింగ్- ఆదగ్గా అయ్యగారికి దొడ్డదే దొరికింది—కూస్త కూపీతీసి- భయంపెట్టాలి- అనుకుంటూ- అలాగే నిలబడ్డింది.

సుగుణ స్నానాలగదిలోనే కట్టుబట్ట వదిలేసి- ఒక్కగ తులో- మోహన్ని కూచోబెట్టొచ్చిన పక్కగదిలో చీరకోసం- పరుగెత్తు తోంది- చాటునదాగిన మోహన్ని చూడలేదు. మోహన్ అలాగే నిలబడి గదిలోకెళ్ళేదాకా- చూస్తూ డి-వెనకాలే ఆగదిలో ప్రవే శి చాడు.

సుగుణ అతన్నిజూసి- ప్రక్కనంకినున్న మొగుడు పికారుకు తీసుగెళ్లే ఖండవా చుట్టబెట్టుకు టుంది. చీరకట్టుకు దూ అన్నాడు మోహన్.

'అవతలికెడుదుగూ-ఒక్కనిమిష'

'వెళ్లాలనిలేదు'

'అయితే మనగదిలోకి నడవండి- ఇలాగేవస్తా'

'అం దాకాఎ దుకు ఇక్కడే,

అ టూ ఆమెచేత్లో పట్టుకున్న ఖ డువా కుచ్చెళ్లు సడలించి మెడ మీాద ఓచెయ్యా-కుడితొడమీాద ఓచెయ్యావేసి-తాను మంచం మీాదికి మెల్లిగావంగి- తన వొళ్లోకూంచో బెట్టుకున్నాడు,

నూరినుంచున్న కిటికీలో నుంచి చూస్తే యిద్దరూ కనపడుతు న్నారు. ప్రక్కగావత్తిగిలి ను చుని-అసహ్యగాచూస్తూనేవుంది.

అంతట్లోకే ఏంఅటుకు డయిందో సుగుణ నగ్నంగానేలేచొచ్చి తలుపు చేరేసింది——

మంచిరస కందా యిప్పట్టులోవు ది ఘట్టం- అందులోనూ పగటి వ్యవహారం——పేచీపూచీలేవు—— అడ్డదిడ్డాల్లేవు——

హాయి! హాయి! హాయి!——మోహన్.

'పురుషాయితం- హాయి- హాయి- హాయి— సుగుణా——'

"ఒక్కమాటు పక్కకితిరగండి- ఆగదిలోకి పోదాం- పాలున్నా యక్కడ"

'అయితే సడూ—

అంటూ మోహన్ లేచాడు తూలుతూ— ఆఖండువే చుట్ట బెట్టుకొని అడపా తడపా అవతలగదిలో కెళ్లారిద్దరూ—

సూరికి— ఈమాటు మాటలేగాని- చూపుండదు— చెవులొగ్గి వింటూంది.

"శ్రీనివాసులు ఎప్పుడొస్తాడు"

"ఇంకోవారం పడుతుంది"

"అయితే వారంవరకూ పండగే"

"ఆహా! తరవాతమాత్రం"

"అసందర్భంగాదూ"

"మనసులు కుదిరింతర్వాత సందర్భాలెంత సేపు"

"సరి పడద్దూ"

"నేచేస్తాగా— అదంతా"

"రైటో- ఏదీ- ముద్దు—"

"ఉట్టి ముద్దులే"

'గట్టిముద్దు లుంటాయేమిటి?'

"మొన్న మధ్యాహ్నంలా- ఓమాటు"

'ఇప్పుడొద్దు'

'ఏం'

'రాత్రికి'

'రాత్రి అలా బాగుండదు'

'ఇప్పుడు బావుంటుందా'

'నాకు పగలే యిష్టం'

'అసలదేమిటి—చండాలం"

'ఏమిటో- హాయిగావుంటుంది— ఆకాస్సేపు'

"నోరూ కడుక్కోవాలి- ఇంకోటీ కడుక్కోవాలి"

'నాకు సర్దాగావుండండీ'

'నాకుండొద్దూ''

"పోనీలెండి——

అంటూ చుట్టబెట్టుకున్న ఖండవాతీసేసి- అతను మంచంమీద వెల్లకిలా పడుకునుంటే— అపురుషచిహ్నాన్ని - రెండుపెదిమలతో అది మిపట్టి- ఏమో, చెయ్యబోతూంటే——

'అమ్మగారూ- సుగుణమ్మగారూ- తలుపుగెంటండి'' అనే కేక వినబడింది.

విడిపోయిన జుత్తుముడి సరిచేసుకోకుండా, ఆకండవే చుట్టబెట్టుకొని వీధితలుపు గడియతీసి——

"సూరీ! ఇప్పుడొచ్చావెందుకే?''

"అయ్యగారొచ్చి లోపలికెళ్లారని తెలిసి ఒచ్చానండి.''

"రేపుగాని రారంచెప్పానా'

'ఏమోలెండి- ఏళాకోళం- ఆడకండి''

'నీతో వేళాకోళమేమిటి?''

'నేనొచ్చే టప్పుడికిమాటలు- గుసగుసలిని[illegible]న్నానండి'

'నేను పూజ్జేసుకుంటున్నా నే''

'జుత్తుముడేసుగోకుండా— మొగాన్ని బొట్టులేకుండా—— ఏం పూజండీ''

"దానికివన్నీ అక్కర్లేదే- నువ్వుపో'

'ఇందాకాలోపల చీటీపెట్టానండి- పట్టుకుపోతాను'

'అనకరద్దూ,

"పట్టి గెళ్ళకపోతే ఆవిడ కోప్పడుతుందండి''

"ఇయితే వెళ్ళితీసికో'

అనే సరికి మోహాన్ వున్నగది గుమ్మందగ్గిర కెళ్ళి వెతకడం మొదలెట్టింది. తనగుట్టెక్కడ. బయటబడుతుందోనని తొట్రుపాటు పడుతూనేవుంది సుగుణ మోహన్ లోపల ఉలక్కుండా—పలక్కుండా మంచంమీాద పడుకున్నాడు. సూరీకాస్సేపు అక్కడా ఇక్కడా వెతికి మీారు తీసారా ఆచీటీ అంది.

"నే నెరగనేవ్—నాకు పనుంది నువ్వెళ్ళిపో,

'అమ్మగారూ! అయ్యగారు మంచం మీాద పడుకుంటే యింకా రాలేదంటారేమండీ,

'ఆయన మాబంధుగులు—అయ్యగారి కోసంవచ్చారు'

"తెలిసింది లెండి—నాగ్రహింపయింది"

అంటూ యింకా వెతుకుతూన్నట్టుగా నటిస్తూ వెళ్ళిపోయింది.

సూరివెళ్ళిన తర్వాత మోహాన్ సుగుణతో-ఈదాసీ న్నేనెఱుదును. అది నన్ను చూశ్లేదుగదా! తెలిసింది. గ్రహింపయిందంటోం దేవిటి?

"దాని మొహం-ఆమాత్రం తెలివి కూడానా?"

అల్లానకు ఈదాసీవాళ్ళు కొంపలంటించేస్తారు క్షణంలో"

'అల్లాంటి భయాలేం మనకి లేవు'

"సుగుణా! బయటకు పోతాను గాని యివ్వేళచేతిలో కాని డబ్బులేదు. బట్టలన్నీ మాసిపో యున్నాయి.చాకలాడు తెచ్చేటప్పటికి పదిరోజులడుతుంది. కొత్తవి కుట్టించుకోవాలి,

"ఏభయిచాలా'

"ఏవో స్తా యీరోజుల్లో—అంతేచాల్లే"

అనగానే సుగుణభర్తగదిలోకెళ్లి యినప్పెట్టితీసి వందరూపాయిల నోటొకటి తెచ్చి మోహాన్ చేతులో పెట్టింది. రాత్రి కొత్త బట్టలు కట్టుకొని పొద్దునూకడంతోనే రావాలి అనడంతోనే మోహాన్

చంక లెగరోస్తూ మెల్లిగా అటుయిటు బెదురుచూపులు చూస్తూ జారాడు.

సుగుణ తలుపేసుకొని, ఈసూరిముండ చీటీవంకెట్టుకొని మంచి కులాసాసమయంలో వచ్చిందే దీనిదుంపతెగ కాని అంత మాత్రం చేత దానికేం తెలిసేడుస్తుందని సరిపెట్టుకొని వంట చేసుకోడానికి పోయింది.

---

౨

శ్రీనివాసన్ కాకినాడలో ప్లీడరు. గోలుకొండ వ్యాపార్లు. పెద్ద లార్జించిన విత్తంబాగావుంది. తనూ ఆర్జిస్తున్నాడు. ఖర్చు తక్కువ అంతా పోగుచేస్తేయిస్తోకు. మంచి అందగాడు కులాసాపురుషుడు— షోకైళాకూడాను. కాని కారణం ఘనకి తెలియదు ఎలాప్రాప్తించిందో సుగుణమాత్రం సనాతన కుటుంబంలోంచి వచ్చింది. చాలా ఆచార వంతురాలులాగా కనిపిస్తుంది. పూజలు-పునస్కారాలు చేస్తుంది-శ్రీని వాసన్ కొంతకాలం ఆమెను నాగరికతా ప్రపంచంలోకి తెద్దామని యత్నించాడు- లాభంలేకపోయింది. దాంతో ఒకరిపైని ఒకరికి ఏహ్యాభావాలు పుట్టాయి. పైకి ఆమె నతడు ప్రేమిస్తున్నట్లు-ఆమె తణ్ణి ప్రేమిస్తున్నట్టు కనబడతారు.

ఒక్క విషయం మాత్రంనిజం ఆఏహ్యాభావాలు హృదయాల్లో ప్రబలిన తర్వాత పగలు అన్నివిషయాలలోను కలిసి మెలిసివున్నా రాత్రి భోజనాల అనంతరం- ఎడమొహమూ పెడమొహమూను. పైవాళ్ళకే సంగతిమాత్రం కొంచెములోకూడా తెలియకుండా రోజులు

నెట్టుకొస్తున్నారు. శ్రీనివాసన్ ఈవిషయంలో ఆమెను నిర్బంధ పెట్ట చలేదు-ఆవిడా మగణ్ణిలెక్క చెయ్యలేదు. అతడుకూడా ఏదేనా తగిన చెయ్యిదొరికితే-సుగుణకి తెలియకుండా ఓచూపుచూస్తూనే వున్నాడు ఆవిడ సంగతి మనకి తెలియనే తెలిసింది.

ఇహ సూరికిమాత్రం ఒక్కదానికి సుగుణ వ్యవహారమంతా బట్టబయలుగా తెలిసిపోయింది. ఆమె యిల్లాంటి వ్యవహారంలోకి దిగిందని శ్రీనివాసుకూ తెలియదు. శ్రీనివాసు అలా మారుతోర్రి వను పోతున్నాడనే సంగతి ఆవిడకే తెలియదు. ఐతే యిద్దరికీకూడా మనస్సుల్లో- యౌవ్వనంలోఉన్న ఆడదికదా- మగాడి అవసరంలే కుండా యింతకాలం ఉండగలదా అని అతగాడికే కొంచం అనుమా నాస్పదమైన సందియం ఉంది—

సుగణకికూడా- పడుచుతనంలోవున్న మగాడుకదా- ఇంతకా లం ఆడదాని సంపర్కంలేకుండా ఉండగలడా అనే సందేహం వుంది— ఇద్దరూకూడా పైకితేలకుండా బహుసమ్మకంతో- ఇరుగు పొరుగు వారి కేమీ అనుమానం తట్టకుండా సంసారం గెంటుకొస్తున్నారు.

శ్రీనివాసు ఏదోపనిమీద వారంరోజులయింది మెడ్రాసు వెళ్లాడు. వెళ్ళాపుడు మామూలుగా నమ్మకంగల మగాడిలాగే బం దోబస్తేమీ చెయ్యకుండానే వెళ్లాడు. కాని సుగుణమాత్రం చాలా కాపుదలగా మోహన్‌తో కేళీకలాపాలు సాగిస్తోంది.

మోహన్ కాకినాడలో ఒకప్పుడు పేరుపొందిన రౌడీ- యీ మధ్యకాంగ్రెస్సులోకి దిగి కొంచెం ఫామేదానేర్చుకొకున్నాడు. అంద గాళ్లలోనే లెక్కపెట్టొచ్చుగాని శ్రీనివాసంత అందగాడు కాడని చెప్పాలి. అయితే ఆడదానికి వలపుకలిగిందంటే అందచందాలు చూడదు. సాహసించి తోవ్రవ తొక్కేస్తుంది. మోహన్ పేద వాళ్ళల్లో లెక్కేగాని- ఎప్పుడూ గ్లాస్కోపంచ- ట్విల్లుషర్టు- సిల్కు

లాల్చీలు- బ్లేజరుకోట్లు- కాళ్లకి స్లిప్పర్లు- కళ్ళజోడు- చేతిలో బెత్తం- నోట్లో సిజర్ సిగరెట్టు హాజరు.

ఏహో ఛాన్సులు కొడుతూంటా డిలాంటివే. అతని కేంలోటు— హోటల్లో భోజనం, ఓ మేడమీద గదిలో బస- సుగుణకి అతనితో- అయాచితంగా ఆరుమాసాల క్రిందట పరిచయం కలిగింది. అప్పణ్నించీ అడపా- తడపా— యీ వ్యవహారం సాగుతోనే వుంది. సుగుణని ఏలాగైనా తీసుకు నెక్కడికేనా వుడాయించాలనివుంది మోహన్‌కి. ఆమెతో చెప్పలేదుగాని సుగుణమాత్రం దానికంగీకరించదని అతని మనో నిశ్చయం- అయినా గేలం వెయ్యడానికి అదును చూస్తూనే వున్నాడు.

శ్రీనివాసు మదరాసు వెళ్లిన మధ్యాహ్నమే మోహన్ ఏలా పసిగట్టాడో- సుగుణ యింటికొచ్చాడు. ఈ వారంరోజులునుంచీ స్వేచ్ఛగా వారు రహస్యకలాపం సాగిస్తున్నారు.

ఈవేళ సూరికంటమాత్రం బడింది. సూరికింత . బట్టబయలుగా తెలిసిందని వాళ్లిద్దరికీ తెలియదు. కాని లోపల కొంచం కళవళపాటు పడుతూనేవున్నారు. అలావుండిన్నీ కూడా- రాత్రికీవిడ రమ్మనడం- ఆయన సిద్ధపడడంకూడా మానలేదు.

---

## 3

"సూరీ-మీ బాబుగా రొచ్చారా?"

'ఇంకా లేదండి,

'ఎప్పుడొస్తారు'

'అయమ్మ- రేపో ఎల్లుండో ఒస్తారని చెప్పింది కాని నాకునమ్మకంలేదు.

"ఆవిడ కన్న నీకెక్కువేలా తెలుసు,

'ఏమోగ్గాని యెల్లింది పట్టవాసం- కోర్టుయెవహారం-పెందరాళే ఒస్తాని కొల్లా,

"మరావిడల్లా ఎందుకు చెప్పిది?"

"ఆవిడ కలాచెప్పి పోయారేమోగాని నాకు రారనితోస్తాంది"

'రావడంతో కాయితం రాయించి పెడతావా,

'రాయిడాని కేంరాస్తారు-ఇక్కడి కొస్తారో రారో?,

'వచ్చేలా నువ్వు చెయ్యాలి,

'ఆబాబెదటనే మాట్లాల్నేను గాని నేనంటే ప్రాణంవిడుస్తారు,

'అంత దయ కలవారా?, '

"నేనంటే-అంతే"

'మరినువ్వెందుకు మాట్లాడవు,

'గొప్పోరు గదండీ-నాకుభయం

'దయగల వారని నీకు యెలా తెలుసు.

'నేనేదేనా అడగటం తడువుగా యిస్తారండీ,

'ఆయన్నే అడుగుతావా,

'ఆయన్ని వినిపించుకోక పోతే తలుపు చాటుకెళ్ళి మెల్లింగా అడుగతాడు-నెలయ్యిందాని-ఎందుకని-పని ఆడగరు చటాలున గిరాకీట్టెయ్యడమే,

'అయితే నీమాట తీసెయ్యరు,

'తీసెయ్యరనే నాధైర్యం,

"నీ వుపకారం మరచిపోన్లే,

"సరే! దానికేంలెండి—ఆయన్ని రానియ్యండి—తంటాలు పడతాను,

"రాయడ్డాని కేంపుచ్చుకుంటే అదిస్తాను,

“మీకే -డబ్బునోరు-ఇస్తారుగాని ఆయన ప్రతీకాడికెడతార

అందుకేగా నీకాళ్ళట్టు కుంటున్నాను,

“అందాకా ఎందుక డోయి,

“అదికాదే-నాపని తొందర అలాంటిది,

“నే నాయమ్మకి తెలియకుండా-సమయంచూచి అడుగుతా,

“ఆవిడికి తెలిస్తేనేం,,

‘తెలిస్తే రానీదేమోనని,

‘కోర్టు కాగితాలు రాయడాని కావిడిష్టమేంటి’

‘నే నియ్యాళ పొద్దుట-ఆయమ్మని బాబుగా రెప్పుడొస్తారని అడుగుతుంటే-ఆవిడ ఏవేవో అడిగింది-మిమ్మల్ని’

‘నామాటడిగిందా? ఏవని,

“ఆవిడెవరు? ఆ కాయితమేంటి-మగాళ్ళున్నారా? మనింటికేరా గూడదా అని.

‘ఏవ్వేం జెప్పావు,

‘ఆవిడెక్కడికీ కదల్లని-ఏదో కాయితం రాయడానికి బాబు తీసి గెళ్ళాలని చెప్పాను?

‘అంటే ఏమంది’

‘వాటురారు. ఆవిణ్ణే రమ్మన మను అంది’

‘మనసంగతే వనుకుందో’

‘ఆవిడికి తెలియదుగా,

‘తెలియజెబుదాం-ముందుముందు’

“దేవాంతకు రాలమ్మాయి నువ్వేటనుకుంటున్నావో”

‘అలాంటి చోటే మన మగ్గం బగ్గాలి’

“అందుకేగా నేనూకొట్టు కొంటున్నాను.”

“నీకొట్లాటకు ఫలితం—ఉండకపోదు

“ఊఁ!”

“ఇదుగో! ఈచీర నాలుగుసార్లు కట్టుకున్నాను. గడ్డైనామాయ లేదు. పట్టికెళ్ళు”

‘ఇప్పుడెందుకండీ’

‘నాకివ్వాలనుండి యిస్తున్నాను- దానికీ దీనికీ సంబంధంలేదు’

‘అలివేణమ్మగారూ! ఈచీరెక్కడదని మామావ అడుగుతా డేమో అని భయంగావుందండి’

‘భయమేం- ఫలాని అలివేణమ్మగారిచ్చిందని చెప్పు’

“ఎందుకిచ్చిందంటే”

“ఆరింట్లో అడపాతడపా పైపని చేసిపెడుతూంటాను. అందుకిచ్చిందను’

‘పనిజేస్తే జీతమియ్యాక బట్టలిస్తారా అంటే’

‘జీతం ఓరూపాయిస్తారు—అను’

“మరి ఆరూపాయేదంటాడు”

“ఆరిదగ్గరే అట్టేబెట్టుకొని రెండువుంజీలైన తర్వాత యిస్తానన్నారు- సరేఅన్నానని చెప్పు’

“బలేవారండి- మంచిఊహే మీది’

“మరేమిటనుకున్నావు- పన్నితే పన్నాగం అలాగే పన్నాలి— మనపని జరగటంతోటేనే యివదలుచుకున్నదిస్తాను. అప్పుడు చూసెడతావు, కాని మావంటూవేమిటి’

“మాకులవోళ్ళంతా కట్టుకున్నోళ్ణ్ని అలాగే పిలుస్తారు”

‘అదా? నీమావేంజేస్తాడు’

‘స్టేషన్లకాడ బస్తామోత మోసేవాడిదివరకి’

“ఇప్పుడో”

‘ఇప్పుడో పాతికమంది కూలీలకి మేస్త్రి’

'ఏంవిస్తారు'

'వారానికి రూ 12—15 ఇలా దొరుకుతాయి'

'మంచిసంపాదనే'

'సంపాదన మంచిదే- కాని యింటికొచ్చాటప్పటికి సగమే'

"అదేం"

'సారాయికి కర్చుపెట్టేస్తాడు'

'రోజూనా'

'ఆహాఁ!'

'అదికూడదని చెప్పలేకపోయావు'

'అబ్బో- చెప్పిచెప్పి నాప్రాణం యిసిగిపోయింది— తాగితేగాని పంజెయలేను మొర్రో అంటాడు. ముతగ్గుడ్డల టోపీలోళ్ళు సెబితేనే యిన్లేదు—'

'తాగి తందనాలాడుతాడా?'

'తాగినట్టే ఉండదు— అల్లరేంలేదు'

"అల్లాటివాణ్ణెందుకు కట్టుకున్నావు'

"ఆగుణంతప్ప మరో యెధవగుణం ఏమీలేదండి"

"నువ్వెంత సంపాయిస్తావు?"

"నాదెంత- పైకర్చుకొస్తుంది- పీండరు బాబుగారు నెలకు జీతం 5 రూపాయిలిస్తారు. ఇంకోచోట మూడు. అంతా మెనిమిది'

'బాగానే వుంది- నీమొగుడు తాక్కుండావుంటే అంతాడబ్బే'

"ఉండలేడండి- అక్కడికొచ్చాటపటికి మంచితనం ఉండదు"

'చిన్నప్పటినుంచీ అలవాటేనా యేమిటి?'

"మోతలో కెళ్లే దగ్గిరనుంచీని"

"ఇకవదలడం కష్టమే"

"ఘొష-శీనే నెల్లొస్తానండి"

"వెళ్ళు-మళ్ళీ ఎప్పుడొస్తావు"

'ఏదో ఓవేళ మొహ చూపిస్తాగాదండి'

"ఎలాచేస్తావో ఆయన్ని తీసుగొచ్చి కాయితం రాయించె పూచీ నీమీద బెట్టాను"

"అలాగేలెండి-పందాచుకోకుండా యత్నంచేస్తాను"

అంటూ సూరివెళ్ళిపోయింది. అలివేణి తలుపేసు కొని యింట్లో కెళ్ళి పోయింది.

---

## ౪

"అలివేణి" కాపురం విశాఖపట్టణం జిల్లాలో పల్లె-పట్టణంగా కుండావుండే వొకవూరు. కులానికి ఎవ్వరైతేనేం-మంచికులంలోనే పుట్టింది- నుదుటిరాత ఎవరు తప్పించగలరు?

తల్లీ దండ్రీ పన్నెండో యేడొచ్చేవరకూ గారాబంగా పెంచారు. ఇంతున్నవాడికిచ్చి పెళ్ళిచేసారా జిల్లాలోనే—పదునాలుగో ఏట కాపరానికెళ్ళింది-అతడో మిల్లుకు యజమాని—లక్షలకొలదీ ఉన్నసంసారి-వెనకాముందూ ఎవ్వరూలేరు—అలివేణిని పువ్వుల్లోపెట్టి పూజించేవాడు.

అదేంకర్మమో కాని అతనంటే ఈవిడికి సరిపడింది కాదు. అక్కడికే పెళ్ళాం ఎల్లాచెపితే అల్లా వినేవాడు. మిల్లుకెళ్లమంటే వెళ్లేవాడు- మానెయమంటే మానేసేవాడు. 'నాకింతడబ్బు కావాలంటే యినప్పెట్టి తాళాలిచ్చేసేవాడు. పలానివాడికి మిల్లులో పనియివ్వాలంటే యిచ్చేవాడు తీసెయ్యమంటే వాడిపని ఆవేళతో బర్తరఫ్.

ఇలావుంటూండగా ఆమిల్లుకో బ్రాహ్మలబ్బాయి తరఫీదుకొచ్చాడు. పేదవాడు. తిండీబట్టాయిచ్చి లెక్కలు నేర్పించాడు కొంతకాలం అతడికి తన మేడమీదో గది బసకిచ్చాడు. ఆ అబ్బాయికి పద్ధెనిమిదేళ్ళుంటాయి. ఒక్కపలచగా-ఎఱ్ఱగా-అందంగా వుంటాడు. ఆరు మాసాలు లెక్క నేర్చుకుని బుద్ధిమంతుడవటంచేత బలేరాతగాడు-లెక్కగాడూ అయ్యాడు. అతని చురుకుదనానికి మెచ్చుకొని నెలకో పాతిక రూపాయీల జీతంమీద గుమాస్తాగా వేశాడు.

ఆ పనిలో ఆ అబ్బాయి తనచురుకుదనం—చాకచక్యం-నేర్పూ చూపి_యజమాని మెప్పుపొందాడు. మరోపాతిక రూపాయీల హెచ్చు జీతంమీద పెద్దగుమాస్తా అయ్యాడు-యజమాని మిల్లు కెళ్ళలేకపోయినా-మిల్లువ్యవహారాలు కోర్టుపనులూఅన్నీ చూసేవాడు. అకారణంచేత అతనికి కొన్ని పవర్సిచ్చి మానేజరుగా నియమించాడు మిల్లుకి_నేడో రేపో పెళ్ళిగిళ్ళీచేసి- ఒకొంపకట్టిచ్చి—బాగుచేదా మని చూస్తున్నాడు.

అలివేణి ఆ కుఱ్ఱాడొచ్చింది దగ్గిర్నించీ అతని మీద కన్ను వేసింది. అయితే అవకాశం చిక్కడంలేదు. అక్కడికే అతనికేవో యింటిపనులు పురమాయించేది. భయభక్తులతో చేసేవాడు. మిల్లుకు మానేజరునని గర్వం ఏమీలేదు-తనిక్రింద వాళ్ళని పూర్వంఎల్లాచూసేవాడో.అల్లాగే చూసేవాడు-యజమానంటే యెంతో భయభక్తులతో వుండేవాడు.

ఆ అబ్బాయి పొద్దునపోతే మళ్ళీమధ్యాహ్నం—మధ్యాహ్నం పోతే రాత్రి వచ్చేవాడు—అలివేణి అతనితో కులాసాగా మాట్లాడాలని అవకాశాలు వెతికేది- తీరుబాటుంటేగా- కనబడితేగా-

కొంతకాలం జరిగేటప్పటికతనికి శరీరంలో జబ్బుచేసింది. మిల్లు కెళ్ళడంలేదు. మిల్లుపనులన్నీ యజమానే చూచుకుంటూ— అతని

ఆరోగ్యం కుదుట బడటానికి- ఎన్నికయిన డాక్టర్లని రప్పించాడు— టైఫాయడ్ ఫీవరు- చాలాగడ్డుగా వుందన్నారు— ఎంతబడితే అంత డబ్బిస్తాను— ఆ అబ్బాయిని బ్రతికించమని కాళ్ళా వేళ్ళా బడ్డాడు— అతని కేంగావాలో ఏంసేవలు చెయ్యాలో- చెయ్యడానికి అలివేణిని పురమాయించాడు— పెద్దపెద్ద డాక్టర్లు పనిజేస్తారు. లాభములేక పోతూంది.

డాక్టర్లు అతనియెదుట అనకపోయినా— చాటున చప్పరించే శారు. అలివేణి ఆఅబ్బాయి క్షేమానికి కేమికావలసివస్తుందో అని అహాళ్ళ- రాత్రిళ్ళ అతనిదగ్గిరేవుండి సేవలు చేస్తూంది.

ఒకనాడు సంధి ప్రారంభించింది— డాక్టర్లుపోయరాని మందులు పోస్తున్నారు చాలాకృశించిపోయాడు- ఆసంధిలో యజమానిని పిలిచి దణ్ణంపెట్టి నన్ను చేరదీసి పుత్రభావంతో నన్ను వృద్ధిలోకి తెచ్చారు— మీఋణం తీర్చుకోనియ్యకుండా భగవంతుడు నాబాగు చూడలేక— నన్ను తీసుగుపోతున్నాడు అనియేడ్చాడు.

నీకేం భయంలేదు. ఎంతడబ్బయినాసరే నేను బాగుచేయిస్తాను. మనస్సు పాడుచేసుకోకని ఓదార్చాడు. యజమాని కళ్ళవెంటగూడా నీరు కాలువలు కట్టింది.

మరోమాటు సంధి తెరవచ్చాటప్పటికి అలివేణి అతని మంచం పట్టెమీదకూర్చుని అతని ముఖంకేసి చూస్తో- ఇంతజబ్బులోకూడా ఆముఖం కలకల్లాడుతోనేవుంది అనుకుంటూంది- అంతట్లోకే అతడు గుభాలునలేచి, అమ్మా! మీరునాకు చాలాచాకిరీచేసారు. మీఋణం తీర్చుకోకుండానే నేను పైలోకంలోకి పోతున్నానని యేడ్చాడు.

అలివేణి కళ్ళవెంట నీరుకారుస్తూ, ఏంభయంలేదు- మేము న్నాం. గుండెచెదరిపోతుంది- కలతపడొద్దు- అతని కళ్ళనీళ్ళు తన పైటచెంగుతో తుడిచింది. ఆమె అతని స్పర్శసుఖం పొందడానికదే

ప్రథమం దైవం తిన్నగాచూస్తే యెంతసేపు మర్యాడాసంధి తగ్గిపోవడం- క్రమంగా ఉద్ధృతం తగ్గి పత్యానికి రావడం పక్షంలో జరిగింది. యజమాని సంతోషానికి మేరలేదు. అలివేణి ఆనందానికి మేరలేదు.

మరిరెండు మాసాలకి మామూలు మనిషయ్యాడు. ఇంతవరకు అలివేణీ అతని కష్టసుఖాలు చూస్తోంది— పత్యం పెట్టేటప్పుడు- రక్తం పేదుతోంది వంటికని, శరీరంమీద కొంచెం గట్టిగారాచిచూసేది—— ప్రక్క వేసేటప్పుడు ఈదుప్పటి మాసిందని మరోటితెచ్చి ప్రక్కవేసేది ద్రాక్షపళ్లు మరినాలుగు తినమని నోటికందించేది- ఆమె మనస్సులోవున్న తలంపుమాత్రం అతడు కనిపెట్టలేదు.

ఆవేళతిరిగీ అతడు మిల్లులో తనమానేజరు పదవిలో ప్రవేశించాడు మిల్లంతా కలకల్లాడింది. అతని సురక్షితంగా, తనపనిలో తిరిగి ప్రవేశించినందుకు యజమాని మిల్లుకూలీలకు- రెండురోజుల కూలీ- గుమాస్తాలకో నెలజీతం- ఉచితంగాపంచిపెట్టాడు. కాని అతడు లేనందువల్ల మిల్లుపని సరిగ్గా జరక్క వచ్చేలాభంలో సగంవంతు తగ్గింది——

అతడు మిల్లులో చేరి నాలుగేళ్లుదాటింది. రెండేళ్లలో అతడుమిల్లుకి అమితమైన లాభం చేకూర్చాడు కూలీలకు కూలి హెచ్చించి సౌకర్యాలు చేశాడు- ఓహో అనిపించుకుంటున్నాడు. చాలామంది కాతాదార్లుతప్ప- ఎవరొచ్చినా, అతడే మిల్లు యజమానని అనుకునేటట్టుగా వ్యవహరిస్తున్నాడు.

అలివేణి అతనికోసం తహతహలాడుతోంది- అవకాశం చిక్కడంలేదు. ఇంట్లోపెత్తనం ఆవిడిది- మిల్లులోపెత్తనం- ఆ అబ్బాయిది- ఇలావుంటూండగా మిల్లుయజమాని యేదోపనిమీద కలకత్తా వెళ్లవలసివచ్చింది. ఇదివరకెవ్వనిసర్వాధికారులూ- అతనికప్పజెప్పి- నేవచ్చేసరికి రెండుమాసాలవుతుంది. జాగ్రత్తగా వుండండని- నీకు

తోడుగా మానేజరు టాజేమి భయంలేదని- అలివేణికిచెప్పి కలకత్తా వెళ్లిపోయారు యజమాని.

ఆవేళ అలివేణి మధ్యాహ్నం 12 గంటలకి మేడమీదికెళ్ళింది. ఆమెనుజూచి, ఇలావొచ్చారు-ఏంకావాలి-అంటూ లేచినిలుచుని వినయంగా మాట్లాడాడు ప్రసాదరావు. అలివేణి ముసిముసి నగవులతో అతని గదిలో కెళ్లి-ఈసామానులన్నీ యిలావుంచారేవిటని—అన్నీ సర్దుతోంది—

'నేసర్దుకుంటా లెండి-మీకె దుకీ శ్రమ'

'మానేజరుగారు స్వయంగా సర్దుకోవడమా?'

"ఇక్కడ మానేజరేవిటి-మిల్లులోగాని"

"ఇప్పుడ్టింటికూడా మీరే మేనేజర్లు"

'అదేంమాట'

'అంతామీకే వప్పచెప్పివెళ్ళారుగా-నన్నుకూడా'

'అంచేత మీరేంగావాలో నేను చెయ్యాలిగాని,

'ఏంకావాలంటే-అదిచేస్తారా?'

'చెయ్యాదగుంటే'

మానేజరుగారు చెయ్యలేక పోవడమేమిటి?'

'మానేజరైనంత మాత్రాన ప్రతీపనీ చెయ్యగలమా?'

"చెయ్యగలరు"

అంటూ ఆమె ప్రసాద్కి దగ్గరగావచ్చి నిలబడింది. అతడు ప్రక్కకు తప్పు కున్నాడు.

'మాబోటి వాళ్ళను తగలరు కాబోలు'

"అవసరమేముంది?"

'అవసరముంటే తగులు తారన్నమాటే అంటూ విరగబడి నవ్వింది.

అప్పటికి ప్రసాద్ కొంత గ్రహించుకున్నాడామె దురభిప్రాయాన్ని. కాని పైకి తేలలేదు. అంతట్లో ఆమె కిద్ది కెళ్లి వెండిపళ్ళెంతో కొన్ని ఫలహారాలు తెచ్చి పుచ్చుకోమంది. ఇవన్నీ ఎందుకండీ అన్నాడు—

'అండీ-గెండీ-ఏమిటి?'

"యజమాని భార్యను మరెలాపిలుస్తారు'

"మానేజరుగారు పేరుతో పిలవచ్చు,

"అది కూడని పని,,

'మహాదోషమా-ఇదే మహాదోషమైతే-నేనడిగిందెలాచేస్తారు

"మీరేమి అడగందే,

'సమయం జూచి అడుగుతాను'

తాహతునుబట్టి చేస్తాను—నాకు ఇల్లుకు పోయే వేళయింది. మీరు వెళ్ళండి—అన్నాడు,

...కేక కొంచెం పెందరాళ్ళేర డి—తలంటుకొని చాలారోజులయింది—అలావుండకూడదు.నీళ్లుపెడతాను—5గంటలకేవచ్చెయ్యండం దలివేణి—ఇవేళవొద్దండన్నాడు ప్రసాద్ అలాగాదు అలావుంటే నాకు బాగులేదు అంటూ ఆమె వయ్యారంగా నవుస్తూ క్రింది కెళ్లిసావడిలో నిలబడింది.

ప్రసాద్ పైనఖండువా వేసుకొని ఏవో కాకితాలు చేత్తోపట్టుకొని క్రిందికి దిగొచ్చాడు. కుర్రాణ్ణైనవణ్ణైనా పంపండి. బజారుపనుందని అలివేణి ప్రసాదుకు దగ్గఱగావచ్చి, మిమ్మన్నే అని ఖండవాలాగి మరీచెప్పింది. ప్రసాదు తలవంచుకుని బయటపడ్డాడు. అతణ్ణి కనుచూపునమేరకూచూసి, లోలినికెళ్లి మంచంమీద వాలి ది—

ఎన్ని యెత్తులువేసినా లొంగలేదు ఏంజరుగుతుందో, ఇక చిన్న చిన్న యెత్తులు లాభంలేదు- రోజులు గడిచిపోతున్నాయి వారము వ్యర్థంగా పోయింది. ఈరాత్రి స్పష్టంగా అడిగేస్తాను.

అని గుభాలునలేచి బయటకొచ్చి దాసిచేత నీళ్లుకాపించింది. కుంకుళ్లు కొట్టించింది. నలుగుబిండి- నూనె రడీ చేసింది ప్రసాదుకు తలంటడానికి అన్నీ సిద్ధంచేసి- అయిదెప్పుడవుతుందా అని యెదురు చూస్తూంది.

ప్రసాద్ మిల్లు కెళ్ళాడన్నమాటేగాని మనసు మనసులో లేదు. అలివేణి యేదో నాకోసం పన్నాగం పన్నుతోంది- వలలో పడిపోతినా స్వామిద్రోహం- పడకపోయేనా మొదటికే మోసం- నామిసమిసలాడే యౌవనం చూచి, ఆవిడ బుసబుసమంటోంది- అని యింకా ఏమేమో ఆలోచించి- ఓ నిశ్చయానికొచ్చాడు.

సాధ్యమైనంతవరకు స్వామిద్రోహాన్ని కొడిగట్టను. ఇహ తప్ప కొచ్చిందా సిద్ధపడవలసిందే- లేకపోతే ఇకనావిడకంట బడకుండా పోవలసిందే అనుకుంటూండగనే మిల్లుగడియారం 5 కొట్టింది. పనంతా గుమాస్తాల కప్పజెప్పి యింటికొచ్చాడు. అలివేణి అతనికోసం ఎదురు తెన్నులు చూస్తో- అల్లంతదూరాన రావడంచూసి- ఎగిరిగంతేసి యింట్లోకి పరిగెత్తింది. అప్పటికప్పుడే రాత్రిభోజనాలకు కావలసిన వన్నీ- బలేతమాషాగాచేసి సిద్ధపరిచింది.

ప్రసాద్ సరాసరిగా మేడగదిలో కెళ్ళాడు- ఏదో ఆలోచిస్తూ నుంచున్నాడు- అలివేణి వెనకాలేవెళ్లి ఆలోచిస్తున్నారేమిటి- అభ్యంగనానికిరండి అభ్యంతరం చెప్పకుండా- అంటే, పెట్టెతీసి టవల్ పైకి తియ్యబోతున్నాడు.

అన్నీ అక్కడున్నాయిరండని చెయ్యిబట్టుకొని తొందర చేసింది. తలంటుకు సిద్ధపడ్డాడు. ఆమె స్వయంగా తలమీదనూనె పెట్టి- మర్దనాచేస్తూంది- పైటచెంగు కిందకి జారనిచ్చింది- చీరకుచ్చెళ్లు బాగా పైకెగదీసి బిగించి కట్టింది- ఆశిరోమర్దనపు ఊపుకి- ఆమెనడుం జవజవలాడుతుంది—

ప్రసాదేమైనా ప్రవరుడా యేమిటి? చూసీచూడనట్లుగా ఆమె అవయవసౌష్టవం తిలకిస్తున్నాడు. నలుగుపిండితో నలుగుపెట్టడం— ఆరంభించింది- ఆసంతోషపారవశ్యంలో ఆమెనోటివెంట హఠాత్తుగా-

"అలివేణి—తొలిబోణి"

అనేపాట లయయుక్తంగా వచ్చింది. దాంతో ప్రసాద్ మరో లోకంలోకి పోయాడు. మరోగంటకి తలంటు పూర్తయింది— పట్టు పీతాంబరం తెచ్చియిచ్చి కట్టుకోమంది నేనుకూడా స్నానము చేస్తా నంది— కానిమ్మన్నాడు. మేడమీద కెళ్ళొస్తానంటే- నాకొక్కర్తెకీ భయం ఇక్కడే వుండాలంది ప్రసాద్ అలాగేనంటున్నాడు- ఆమె ముందుగా జాకట్టు తీసేసింది- తరువాత కట్టుపుట్టం చేతితో జార్చింది- ప్రసాద్ తెల్లపోయి అటుముఖం పెట్టాడు. ఆమె అతన్ని పలకరించి— ఏదో అల్లా పాకిపోతోందని- భయపడినట్టుగా నటించి, అనగ్న స్వరూ పంతో ప్రసాదు దగ్గరగావచ్చి- అతనిపైమీది తువాలు తీసుకొంది. ఏంచేసినా ప్రసాద్ కాదనడంలేదు. ఆతువాలే చుట్టబెట్టుకొని యింట్లో కెళ్ళి పట్టుచీర కట్టింది.

రెండు వెండికంచాలలో యిద్దరికే వడ్డించింది. ఇద్దరూ కులా సాగా భోంచేసారు. మీరివ్వేళ మేడమీదకు పోవద్దు, నాకుభయం వేస్తున్నది. లేకపోతే నేను అక్కడే పడుకుంటాను అంది, ప్రసాద్ తలూపాడు.

భోజనమవంగానే ప్రసాద్ వరండాలో నిలబడ్డాడు. అలివేణి పైనా-క్రిందా-అంది. నీయిష్టం అన్నాడు ప్రసాద్, శయ్యాగృహం లోకి నెట్టుకు పోయింది. పాపదేవత వారిద్దర్ని-తాంబూల సేవనం-హరి చందన-మర్దనం—ఇంకా ఏవేవో రసికానందం—

♦ ♦ ♦ ♦

రెండ్రు ఘూసాల్లు దాటింది—మిల్లు యజమాని వారంరోజుల్లో

వస్తూనట్లుగా టెలిగ్రాంవచ్చింది. ఇప్పు డలివేణీ ప్రసాదులొక్కటే శరీరం-ఒక్కటేహృదయం,

ఆరాత్రి పడకగదిలో అలివేణి-మనం సంతోషసాగరంలోంచి దుఃఖ సముద్రంలో పడాలిగాబోలు--మన వ్యవహారం అంతా బట్ట బయలుకాకుండా ఏదో త్రోవచూచుకుందాం—— అంటే, సర్యే అన్నాడు ప్రసాద్.

ఆమర్నాడు మిల్లువారందాకా కట్టెవేస్తున్నాను. ఆవారానికి కూలి ముందే యిచ్చేస్తున్నానని బటవ్వాడా చేయించాడు. గుమాస్తా లకి ఏమీ చెప్పకుండా- నేనూరికెళ్ళాలి ఎల్లుండిరాత్రికి వస్తాను. తర్వా తరండని చెప్పాడు. ఆరాత్రిఅలివేణీ ప్రసాదులు తమకు కావలసినవన్నీ మూటగట్టుకున్నారు. ఏభయివేలు రొక్కం- వలసినన్ని నగలూ—— పట్టుకొని యింటికి తాళంవేసి యజమానికోవుత్తరం రాసిపెట్టి- అం దులో తమ కోసం వెదకవద్దనీ—ఈశ్వరుడికైనా మమ్మల్ని పట్టుకో తరంకాదనీ ఉదహరించి వుడాయించేసారు బొంబాయి——

ప్రసాద్ మొదట నుంచీ మారు త్రోవచూసు కుంటూనే ఉన్నాడు. డబ్బంతా అతని దగ్గిరేవుంది. బొంబాయిటాజ్ మహల్ హోటలులోదిగారు-పట్టణ మంతాచూసారు పదిహేను రోజులున్న తర్వాత-ప్రసాదోనాడు-నేనుపూనా వెళ్ళిరేపు సాయంకాలానికొస్తాను. నీనగలన్నీ జాగ్రత్తగా వుంచుకో-20వేలు రొఖమిదిగో—జాగ్రత్త—— 30 వేలు తీసికెళుతున్నాను. ఒక్కవ్యాపారం పెట్టాలని—అలివేణీ నొప్పించి వెళ్ళాడు.

పదిరోజులుదాకా రాలేదు. నెలదాకాచూచిం దలివేణి-నన్ను నెత్తిమీద పెట్టుకొని పూజించే భర్తని మోసపుచ్చినందుకు మంచి ప్రాయశ్చిత్తమేజరిగింది.స్వామిద్రోహి—అని ప్రసాదుని వెయ్యితిట్టి—— గుడ్డిలో మెల్ల- ఈడబ్బైనా యిచ్చి వెళ్ళాడని సంతోషిస్తూ—మరోవా

ర్గానికి కాకినాడ చేరి శుభ్రమైన యిల్లద్దికుచ్చుకొని అందులోవుంది— సూరికి అలివేణికి ఎలాగో పరిచయంకలిగింది. ఆమెవల్ల శ్రీనివ్వాసన్—అందగాడని తెలిసిక్కొని-అతని కోసం వలపన్ను తూంది-ప్రసాద్ గైర్ హాజరయ్యాం తర్వాత—బుద్ధితెచ్చుకొని-ఎవడో ఒకసరసుణ్ణి జేరదీసి కాలక్షేపం చేద్దామని—మంచిత్రోవ వెతుక్కుని—దానికి ఆధారంగా సూరిని నిలబెట్టుకుంది—.

భగవంతు డేంజేస్తాడో చూద్దాం!!!

---

X

"హల్లో! మిస్టర్- శ్రీనివాసన్ ఇదేనేమిటరాక మెడ్రాస్ నుంచి—

'ఔను సార్''

"ఏమిటి మెడ్రాస్ విశేషాలు?''

"ఏంవిశేషాలున్నాయి ఏమంత పెద్ద వేంలేవు''

"హైకోర్టు విశేషాలేమిటి?''

"అక్కడైనా ఏముంది అంతా చెత్తే,

'మీరువెళ్లిన కేసేమయింది'

'సక్సీడ్'

'ఎలా తీర్పిచ్చాడు,

'మాక్లయింటికి ఆస్తంతా అప్పచెప్పి రు 18000 వేలు ఖర్చుల కిచ్చుకోమన్నారు''

'మంచిఛాన్సే''

'ఛాన్సు కేముంది, పెట్టుబడిపెట్టి 8 వేలు పట్టుదలకే పనిచేసాను'

"అలానా! మనకి ఫీజెంత"

"ఎనిమిదివేలు నిర్ణయం నెగ్గితే"

"అమాంబాపతులు పదహారొస్తాయన్నమాట"

"అంతే"

"ఎప్పుడు చేతులోపడుతుంది-"

"రెండుమాసాలు పడుతుంది- వ్యవహారమంతా మనచేతులోనే వుందిగా"

"మీక్లయింట్ మంచివాడేనా?"

"కనకనే పెట్టుబడిపెట్టి పనిజేశాను"

"ఇక్కడెన్నాళ్లు కొట్టుకుంటే ఏముంది?"

"ఏదో కాలక్షేపం"

"అదర్ సైడ్ లాయర్లెవరు?"

"హేమాహేమీలు- భీమశంకరశాస్త్రి, వరదాచారి—"

'ఓ! పెద్దచేతులే- బలేదెబ్బ తీశావు'

'తియ్యడంలో అనకూడదుగాని- వరదాచారి మన ఆర్గుమెంటుకి తలూపాడు.

'మనభీమశంకరం'

'అతడుమహాత్రిం సామాన్యుడా? శ్రీనివాస్ సంతోషముగా వుందోయి: అన్నాడు ఇవతలకొచ్చి—"

"నేనిలా వెళ్లొస్తాను"

"నాకు శెలవిప్పించండి- క్లబ్బులో కలుద్దాం-

అంటూ శ్రీనివాసన్ జట్కా యింటికి పట్టించాడు. సుగణకి శ్రీనివాసన్ ఇవేళ వస్తాడని తెలుసు. అంచేత మోహనరావుని— ఇక్కడికి రావద్దని తనేదో ఎత్తుమీద అతని బసకొస్తానని చెప్పింది—

అప్లాటు ఏవిధంగావేస్తే బాగుంటుందోనని నిరంతరమూ ఆలోచన చేస్తూనే వుంది.

శ్రీనివాసు బండిదిగి యింట్లోకెళ్లాడు మొహానికి చేరెడు పసుపు పట్టించి తలకి స్నానంచేసి- ఇన్ని పువ్వులో పళ్ళెంలోపోసి— దేవుడు మండపం దగ్గిరపెట్టి లోపల మోహన దేవుని ఆరాధిస్తూ— బయటికి విగ్రహారాధన చేస్తోంది భర్తనుచూచి చూడనట్టుగానే నటించి, కన్నులుమూసి జపంచేస్తూంది. ఏంమాట్లాడకుండా బండివాడి చేత సామానంతా యింటిలో బెట్టించి భార్య పూజ్జేస్తూన్న దేవుడు మంటపానికి దగ్గిరగా నిలబడ్డాడు—

అతనికి లోపల అసహ్యంగానేవుంది. అయినా తమాయించుకొని- ఓమాటు సకిలించి-బయటకొచ్చి-సామాన్లేవో చప్పుడుచేసి— మళ్ళీ లోపలికెళ్లాడు—

'ఎంతసేపేవిటి యీజపం?

'పది నిమిషాలని సంజ్ఞచూపింది'

'వంటచేశావా?'

"చెయ్యాలి"

కోర్టుకెళ్లాలి"

"ఈపూటకి హోటల్లో భోంచెయ్యండి"

"ఎప్పుడూ అక్కడే చేస్తాను"

అంటూ ధుమధుమలాడుతో ఆఫీసు రూములోకెళ్లాడు. వెనకాలే వెళ్ళింది సుగుణ-ఇంకా టయమెంతుంది. అడిగితే—గంటని చెప్పాడు-ఆమె తడువుకోకండా—

'వేణీళ్లున్నాయి స్నానం చెయ్యండి,

'స్నానమెందుకు - అదీ అక్కడేచేస్తాను'

'అంత కోపమేమిటి? ఇంతట్లోకే వంటచేస్తాను'

"అయితే తగలెయ్యి—కానితాలుగూసు కంటూను కాస్సేపు"

"కానియ్యండి"

'గుమాస్తా మొన్నే వచ్చాడు. రాలేదు?"

'నాకగుపించలేదు—

'వస్తే ఎందుకగుపించడూ'

"అతడొచ్చే వేళకి నిన్నా మొన్నా నేను లేనులెండి'

"ఎక్కడ కెళ్లావు?"

"పుష్పపేటలోకి యోగి నెవ్వరో వచ్చింది. ఆవిణ్ని చూద్దామని వెళ్లాను"

"రెండు రోజులెందుకు?"

"మొదటినాడు దర్శనం కాలేదు-అంచేత వెళ్ళవలసి వచ్చింది"

'దర్శన మయిందా—బాగా"

"ఆ వెటగార మేమిటి?"

"లేక పోతే యెవర్తోతింకి గడవక వెధవ్వేషంవేసు కొస్తే ఆవిణ్ణిచూడ్డానికి తయారా?"

'అలా అనకండి—కళ్లుపోతాయి ఎంత మహాత్మురాలు'

"ఏవిటా మహాత్మ్యం'

'అది చెప్పశక్యంకాదు-చెప్పినా మీబోటివాళ్ళకు తెలియదు'

'అంత గొప్పదా?'

'ఆహా! ఆవిడందరికీ పూజనీయురాలు- జనంయిసక వేస్తేరాల కుండా వున్నారు'

"అబ్బా! మాయా బజారన్నమాట'

'మీకలా గేవు టుంది-అందరికీ దర్శనమిస్తుందా—అందరితోను మాట్లాడుతుందా?

"నీకయ్యిందిగదా దర్శన"

"దర్శనం అయింది-చక్కగా మాట్లాడి నా దైవభక్తికి మెచ్చుకుంది."—

'మెచ్చుకుని యేమిచ్చింది—బంగారపుకుచ్చుల బొచ్చా'

"అంతే పరిసమ్మకంలేనివాళ్లకి, ఎల్లుండివస్తే ఆవిడపేరుతో ప్రసిద్ధిపొందిన 'దేవదత్తం' అనే మంత్రం ఉపదేశంచేస్తానంది"

"మంత్రోపదేశంకూడానా?"

"అందరికీ చేసిందా- చేస్తుందా— ఆమె మనసుకునచ్చిన వాళ్ళకే'

"దాని మొహం- నీ మొహమూను'

"మీకేం నేనుపదేశం పొందుతాను- మీకేమీ అడ్డంరాదు— హానిచెయ్యను"

'నాకేదేనా హానిచేస్తే దేవదత్తాన్ని- సముద్రంలో పాతేస్తా

'మనపద్ధతి అదే—

అని చెంపలువాయించుకొని వెళ్ళబోతూంది- ఆబుట్టలో పళ్లూ పువ్వులూ, ఇంకేవేవో వున్నాయి ఇంటిలో పెట్టు'

"దాన్ని ధారాలేపీలేవుగదా?"

'ఏమీలేవు, ఉన్నా తకరారులేవుగదా?'

'నాకు సరిపడదు,

"వెధవాచారం మల్లావుంది?

"ఎలావుంట్టేం—నాకిష్టం"

నీయిష్టం వొచ్చినట్టేడు—అన్నంవడ్డిం చు స్నానం చేసొస్తా'

'లేవండి తొందరగా'

అంటూ పళ్ళబుట్ట అంచులు పట్టుకొని కాళ్లు ఎగరేస్తూ లోపలి కెళ్లింది—

శ్రీనివాసు మధ్రాసునుంచి తెచ్చిన తన సామాన్లు సర్దుకో

దానికి తన గదిలో కెళ్ళాడు—అతను మడతలు పెట్టి వంకీనెట్టిన ఖండువా-మాసిపోయి—చిందర వందరగా-మంచానికి మధ్యగాపడుంది దాని ప్రక్కగా, అంచులు క్రిందకు వ్రేళ్లాడుతో మంచంమీద-సిల్కు-వాయిల్ చీర, కంగిరి బింగిరిగా పడుంది-ఆచీర తీదామని వంగితే-మంచం అంచున సగంకాల్చిన సిగరెట్టు కనిపించింది.

ఇవన్నీ చూసే సరికి ఎలాగో అనిపించింది. ఆచీర ఈగదిలో కెందుకొచ్చింది-ఆఖండువా అల్లా ఎందు నలిగి పోయింది—సగంకాల్చిన సిగరెట్టెవరిది-అని ఆలోచిస్తూ అవన్నీ మంచంమీదికి నెట్టి తన సామానులు సర్దించుకున్నాడు.

పెరటిలోకెళ్ళి స్నానంచేశాడు-అక్కడా ఓసిగరెట్టు సగంకాల్చేసింది కనిపించింది. నాలుగు చెంబులు నీళ్ళుపోసుగున్నాడు-పట్టుపంచ కట్టుకొని ఆఫీసు హాములో కెళ్లి-నాలుగు కాయితాలు చూసుకొని-కట్టకట్టి—వంటయింటోకెళ్లాడు పలహారాలు చేసిన వెండికంచాలు కడక్కుండా అలాగే పడున్నాయి-

ఎలాగో నాలుగు మెతుకులుతిని బయట కొచ్చేసరికి గుమాస్తా వచ్చాడు. నమస్కారంచేశాడు-

‘ఏమోయి- కాగితాలన్నీ అలాగేవున్నాయి- ఒకటీచూడలేదు—కట్టవిప్పలేదు’

నాలుగు నాళ్లొచ్చినా-ఎంత పిలిచినా-లోపలనుంచి—సమాధానంరాలేదు. కూచుని కూచుని పోయాను’

“చూడు- ఇవేళేమేనా అర్జంట్లున్నాయేమో?”

‘ఫైలే నాదగ్గరేవుందండి- అర్జంట్లేవీలేవు. కాని వేడంగివారి దావాలోకి కొన్ని నకళ్లు తీసికోవాలి- మీరు శ్రమపడొచ్చారు—మీరీవేళకి విశ్రమించండి- నేను తీసుకుంటాను. వాళ్లెవరూ రాలేదు-దబ్బడుగుదామంటే”

'నేనిస్తా తీసికెళ్ళి పనిసడిపించు- ఇవేళ ఒడలిగ్గానే వుంది'

అంటూ తనగదిలోకెళ్ళి యినప్పెట్టి తీసాడు. అందులో నోట్లు చిందరవందరగా వున్నాయి. 5 పదిరూపాయిలనోట్లు తెచ్చిచ్చి—ఎంత ఖర్చయిందో వాళ్ళకాతాకిరాయి''

'నేను వెళ్లొస్తానండి. మీరెందుకీవేళ'

"రాలేను పడుకుంటా''

అనిచెప్పి గుమాస్తాని సాగనంపి యినప్పెట్టెలో నోట్లన్నీ సరి చేసిలెక్క పెట్టి, ఇంకావుండాలనుకుంటాను- ఎక్కౌంటుబుక్కు చూడాలి. అదేవనా తీసిందేమో సరే, అడుగుదాం- అని బడలికచేత పరుపు దులుపుకొని పడుకున్నాడు.

అత్తరు గుమాయింపు, సెంటువాసన బనాయింపు- ఉక్క కంపు- ముక్క కంపు- పైదుప్పటి మారుద్దామని తీస్తే- కొద్దిగాఎండి పోయిన తమలపాకు బీడాలు రెండు కనిపించాయి- వాటిని కిందకునెట్టి దుప్పటీమార్చి పడుకున్నాడు.

సుగుణభోజనంచేసి వంటిల్లుమూసింది- బయటికొచ్చే సరికి— ఆఫీసుగది- సింహద్వారంకూడా మూసున్నాయి- తనగదిలోకెళ్లింది.

శ్రీనివాసు పడుకున్నాడన్న మాటేగాని కళ్లు మూతపడలేదు— నలిగిన కండువా- విప్పిపడున్నచీరా- సగంకాల్చిన సిగరట్టూ— ఎండి పోయిన తమలపాకుబీడాలు- అత్తరుగుమాయింపులు-అయిరన్ సేఫులో నోట్ల హాజామత్తు- అతనికి అనుమాన సముద్రంలో ముంచేస్తున్నాయి-

అడగనా- మానా- అడిగితేమాత్రం చెపుతుందా- చెప్పక పోతే- సరిపడుతుందా— ఏమో! ఇన్నాళ్ళనుంచీలేని దింతట్లోనే— పుడుతుందా నేనే తప్పుమార్గాన్ని పడుతున్నానేమో?

ఖండవా నేనే తీసి కిందపడేశానేమో! ఒకవేళ యీగదిలో పడుకొన్ని చీరయిక్కడ విప్పివేసిందేమో? సిగరెట్లు ఎప్పుడైనా నేనే

పెట్టానేమో? అత్తరవుకంపు బీరువాలోనుంచి వస్తూందేమో? నోట్లు ప్రయాణం తొందరలో నేనే అలాచేశానేమో! ఎమైనాంటు అంతే నేమో? మరి యీతమలపాకు బీడాలేవిటి? బాత్ రూమ్‌లో సిగరెట్టే విటి? నేనెప్పుడూ అక్కడ కాల్చనే కాల్చలేదే— తమలపాకు బీడా నాకలవాటు లేదే— రెండు కొన్నుకొచ్చాయి- నేనే తెచ్చినవైతే ఇంకా పచ్చిగా వుంటాయా—

అని ఆలోచిస్తూ- కాఫ్లాపుతో పడున్నాడు. సుగుణ తన గది లోకెళ్ళి చీరకట్టుకుంటూ, కొంచెం బిగ్గరగానే—

"మోహనా- నామోహనా— మధుమోహనా!

మరువగలనా- వెరువగలనా— నినుజేరగలనా ॥మో॥

"అనేపాట వినిపించింది. దానితో శ్రీనివాసు మళ్ళీ అనుమా న సాగరంలో పడ్డాడు— ఇందేదో రహస్యముంది- దీన్ని విడగొట్టాలి— పిలిచడిగితే ఏంజెబుతుందో- అడగడం మంచిదా- లేక గప్‌చిప్‌గా వూరుకుంటే మంచిదా? అడిగి ఏం సమాధానమిస్తుందో చూడాలి—

అంటూ పెద్దగా పకిలించాడు. ఆపకిలింపు కులిక్కిపడి, గతుక్కు మని- నాలిక్కరుచుకొని భర్తపడున్న గదిదగ్గిర కొచ్చింది.

"ఆఫీసుకెళ్ళలేదా?'

'లేదు- అర్జంట్లేవీలేవు అక్కరలేదన్నాడు గుమాస్తా'

'ఈమాత్రానికి కాళ్ళల్లో నిప్పులు పోశారే'

'వెడదామనుకున్నాను'

"బడిలిగ్గావుందికాబోలు పడుకోండి'

"తమరెక్కడ కెడుతున్నారేమిటి?'

'ఇప్పుడెక్కడికీ వెళ్లను- అయిదింటికి యోగిని అమ్మగారిని చూడ్డాని కెడతాను'

'అయితే నాకండవా యిల్లా వలిగి మంచంమీద పడుందేం?'

"నాకేం తెలుసును'

'నీసిల్కు వాయిల్ చీర యిలా చింపిరిగా మంచంమీద పడేశా వేమి?'

'మొన్న తొందరగావిప్పిపడేసి మర్చిపోయాను''

"ఈసిగరెట్టు సగంకాల్చింది మంచంమీది కెల్లావొచ్చింది'

'ఏమో! నేను కాల్చానంటా రేవిటి నాకర్మంకాలి- ఎప్పుడో మీదనే అయుంటుంది'

'పరుపంతా యీసువాసనేమిటి?'

'నేనుగాని మీపరుపుమీద పోసానంటారా అత్తరువు'

'ఈసగం ఎండిసతమలపాకులు బీడాలేమిటి?'

'మొన్న తెప్పించాను నూగుర్విణి కిద్దామని''

'ఆవిడ తమలపాకు బీడా వేస్తుందేవిటి?'

"ఆమె కేవిటి? సర్వసంగ పరిత్యాగినికి''

"సర్వసంగపరిత్యాగినికి తమలపాకు బీడాఎందుకు?''

"ఆమె కలవాటు''

'అయితే స్నానాలగదిలోసగం కాల్చిన సిగరెట్టెందెక్కడిదీ'

'ఏమిటీ ప్రశ్నలన్నీని— నేచూసిచచ్చానా? నాకెందుకీ గొడవలన్నీ నాపూజా, నాజపం నాది— అంతే'

'ఇనప్పెట్టెలో డబ్బేమయినా తీసావా?''

'ఇదివరకెప్పుడేనా తీశానా?''

"నోట్లు చిందరవందగా పడున్నాయి'

"నాకు డబ్బెందుకు- పిల్లా, పాపా''

'పిల్లా పాపా ఎల్లావొస్తారు- మొగుడు స్పర్శ తగలనివాళ్లకి'

'స్పర్శతగిలినంతమాత్రంచేత వస్తారుకాబోలు'

'పెద్దలంటారు''

"దేవుడి దయవుండాలి, మాయోగినమ్మగారివంటి మహాత్ము రాలి ఆశీర్వచనం- మంత్రోపాసన ఏదోవుండాలి''

'మంత్రోపాసన వల్ల పిల్లలు పుడతారు కాబోలు"

"ఆహా! అదియథార్థం-మున్మాటికీ'

'అందుకేనా ఏమిటి-ఉపాసన పొందటంనీవు'

"దాని కోసమేనా ముక్తికోసంగూడాను"

"ముక్తికోసంరాళ్ళను పూజిస్తారా!"

'మన కన్నీ రాళ్ళూ, రప్పలూను—తెలియక పోతేసరి'

'నాకేం తెలియదులే—ఆ వెధవ పట్టామాత్రం ఎల్లోనోవచ్చింది

"ఆమాటెవరన్నారు!"

'నువు చెప్పే దలావుంది"

'నాయేడుపు నాది, నేనేదో డబ్బు దొబ్బిని దొంగగాను-సిగ ట్లుకాల్చే అపవిత్రులుగానూ- మాట్లాడు తున్నారు లెండి'

'తీశావా అ సడిగాను-తప్పా'

"తప్పులేదు-లాయర్లకి,

'నీ బతుక్కి- లాయర్ల నెత్తి పొడవడమా!'

"మీా యిష్టం వొచ్చినట్లు మాటలాడుతున్నారు లెండి"

'దానికేంగాని-ఇప్పుడాగదిలో పాడిన మోహనా-నా మోహనా పాటయేదీ, మళ్లా ఒకసారి'

'నాకు పాటలు గూడానా-ఏదో నోటికొస్తే కూశాను'

అని మాట్లాడ కుంటూండగా సూరివచ్చింది. అయ్యగారు మంచంమీాద పరుండి అమ్మగారితో మాట్లాడటంచూసింది.

'అయ్యగా రెప్పుడొచ్చారమ్మగారూ!'

"మధ్యాహ్నం 12 గంటల కొచ్చారు'

"నేనా రోజులు కొచ్చారు'

"సూరీ, ఇలారా-బాగావున్నావా!"

"బాగున్నానండి-బాబుగారు పెద్దమకాం ఏశారు'

"పదిరోజులే గాదటే'

"నాకే నెల్లాళ్లో అయినట్టుందండీ'

'అలాగే వుంటుందిలే'

'ఆఫీసు గదూడవనాండి'

'రే వూడ్దున్న తుడుస్తున్నాన్లే'

'అమ్మగారూ! పంపిసరాలా?

'అక్కర్లేదే'

"మరేం పనిజెయ్యమన్నారు'

'చేతువుగానిలే—అయ్యగారితో ఏదోపనుందన్నావు, చెప్పు'

'చెపతాలెండి—ఈడేగా వచ్చారు-ఒడలిగ్గావుంటుంది'

'ఏవిటే సూరి, అది,

"మీరు చెప్పండమ్మగారూ'

'పరవాలేదు—నువు చెప్పవే'

'అలాగది గుమ్మం దగ్గరనుంచుని చెప్పు'

"ఏం లేదండీ, నాకెరుగున్నావి ఒకావిడుందండీ,ఆవిడకేదో లోటు కాయితం రాయాలటండీ'

'ఆవిడింటికెళ్లి రాయాలని చెప్పు'

'ఔనండి-ఎంత డబ్బిమ్మంటే అంతిస్తానందండి.'

"ఆవిడెవ రేమిటే?"

"ఎక్కణ్ణుంచో వచ్చి వున్నారండి'

నోటుకి ప్లీడరెందుకే—ఎవడు రాసినా రాస్తాడు'

"మీరే రాయాలటండి-ఇంకో ప్లీడర్ బాబురాసినా పనికి రాదుట'

'మరే మోసండి నాకు తెలవదు-బాబుగారింటికెడితే రాస్తారని చెప్పానండి'

'పొద్దున్నే తుడవచ్చునుగాని ఆకాకితం రాయించుకునే అవిడెవరే?,

'ఎవరోనాకు తెలియదండి,

'తెలియక పోతే నీకెలా చెప్పింది?,

'మనిషి ఏకులమో తెలియదండి?,

'ఎన్నేళ్ళుంటాయి,

పాతికేళ్లుంటాయండి

'మగాళ్ళెవరూ లేరా?,

ఆవిడ ఒక్కత్తే వుందండి,

'పిల్లా, జల్లా లేరా?,

'ఎవరూ లేరండి,

'మొగుడో, ఆయనొగ్గేశాడు గాబోలండి'

'ఎవరేనా మగాళ్లొచ్చి పోతూంటారా?'

'అల్లాటిదీ లేదండి''

'నిజంగా కాగితమేరాయాలా? ఇంకేదేనా పన్నాగమా?

'కాయితమే రాయాలని చెప్పిందండి,

'మనిషెలావుంటుంది,

'చాలా అందకత్తె అయ్యగారూ?,

'పొట్టెలాగడుస్తుంది?'

'ఆవిడకేమండి- బాగా డబ్బుందండి- సెనగపప్పల్లా ఖర్చు పెడద్దండి,

'నన్ను గురించేం జెప్పింది?,

'నువ్వెక్కడ పనిచేస్తున్నావంటే ఫలానిప్లీడరిగారింట్లో అన్నానండి, దానిమీద ఆయనకెన్నేళ్లుంటాయి- మనిషెలావుంటారు—భార్యా బిడ్డలున్నారా అని అడిగిందండి- అన్నీ చెప్పాను, ఆయన్ని మనింటికి రప్పించాలంటుంది,

'వెళ్ళమంటావా?'

'తప్పకుండా వెళ్ళండి—దర్జాగా జట్కా బండి మీద'

"సరే-రేపు సాయంకాలం వస్తానని చెప్పు"

"అలాగే చెపతానండి—పొద్దుటొస్తారండీ'

అని సూరి మొగ గంతేసి వెళ్ళిపోయింది. శ్రీనివాసు యింటికి తాళంతగిలించి క్లబ్బు కెళ్ళాడు. సుగుణ యోగి నమ్మగారిదర్శనానికని—పువ్వులూ ఫలాలు పుచ్చుకొని తిన్నగా మోహనరావు బస కెళ్ళి పోయింది. అక్కడ వాళ్ళిద్దరూ రాత్రి 8 గంటల వరకూ సరస సల్లాపాలాడుకుంటూ——క్రీడా కలాపాలు సాగించారు.

మోహనరావు సుగుణను వదల్లేక వదిలాడు. సుగుణ యింటికి బయలుదేరి త్రోవలో ఓకుళాయి దగ్గిర స్నానంచేసి తడిబట్టతో యింటి కొచ్చింది. ప్రతిరోజూ కొంత కాలంనలా కిలాగే వస్తూంటానని—వృద్ధువేటలో యోగిని వచ్చిందని కనబడిన వాళ్ళందరితోటీ చెప్పమనీ—అదే మన రహస్య కలాపాలకి సాధన కీలకమంతా అంత పూసగుచ్చినట్లు చెప్పి యింటికొచ్చేసరికి అప్పుడే క్లబ్బునుంచి వచ్చి శ్రీనివాసు తాళంతీస్తున్నాడు.

సుగుణ భర్తకి భోజనం వడ్డించి కావలసిన వన్నీ దగ్గిర పెట్టి తాను దేవుడి మందిరం దగ్గిరకూర్చుని జపం మొదలెట్టింది. శ్రీనివాసు తిండి తింటూనే—ఆమె కేసి మధ్యమధ్య చూస్తూ (అసహ్యించుకుంటున్నాడు. కాని ఆమెను పూజా మందిరందగ్గిర చూసి నప్పుడు తప్ప మిగతా సమయాల్లో అనుమానపడుతూనే వున్నాడు. ఒకన్ను పెళ్ళాం మీద వేసేవుంచాడు—ఎంత క్లిష్టతరయితేనేమి ఆమె రహస్య క్రీడా కలాపకీలకం కనుక్కోలేక పోయాడు అందుకనే——

ఆడదానికి బుద్ధి పుట్టకుండానే వుండాలిగాని పుడితే దాన్ని తెలుసుకోడం బ్రహ్మకూడా వశమా అన్నారు పెద్దలు.

౬

"సూరీ- మనవ్యవహారం కాయా- పండా?"

"పండేనండి అయ్యగార్నిక్కడికి రేపు 5 గం॥లకు రావడానికొప్పించాను"

"ఎలా పతకం వేశావు?"

'సంగతంతా చెప్పానండి- కాయితం రాయాలండి- అగింటికొచ్చని'

అని చెపుతోంటే అలివేణి చెవులింత చేసికొని వింది. కన్నులింత జేసికొని వింది. ఆనంద సముద్రంలో ఊగులాడింది. తనరొట్టె నేతిలోపడిపోతూందిగదా అని లోలోన ఉవ్విళ్ళూరింది. ఇంట్లోకెళ్ళి పదిరూపాయల కాగితం తెచ్చి సూరి కందిచ్చింది. సూరి అదిచూచి-

'మాఅయ్యగారు- పట్నన్నించి తెచ్చిన పువ్వులూ— పళ్లూ— ఏంటేంటో ఇచ్చారండి. మామామాన యింటికొచ్చే వేళవుతోందండి. వెడతానని సూరి వెళ్ళిపోయింది.

అలివేణి యెప్పుడూ తెల్లారుతుందాని రాత్రి తెల్లవార్లూ కలత నిద్దరేపోయింది. సూర్యోదయం కాకముందే లేచింది. పడకగది చిత్రచిత్రాలుగా అలంకరించింది. నిమిష మొక యుగంగా గడుపుతోంది. మధ్యాహ్నం 12 గంటలయింది. చక్కగా అభ్యంగనస్నానం చేసింది. తలార్చుకుంది. సుగంధద్రవ్యాలు, ఆకు వక్క- వగైరాలు తెప్పించింది. నాలుగైదు మధురములైన ఫలహారాలు వండింది. వీటి నన్నిటినీ ఎక్కడెక్కడుంచాలోవుంచి- యిక ముస్తాబవడానికి మొదలెట్టింది—

ఆముస్తాబిట్టిదని కాళిదాసంతవాడే వర్ణించలేడు. సాయంత్రం

్రగెంది. శ్రీనివాసుకోసం గడియారములో అయిదేళ్ళదా అని
స్తోంది—

సూరి ఆవేళ ఉదయం శ్రీనివాసుకు నేను ఫలానా యింటి
రుగానున్న మేడలోకెళ్లండి. అదే అలివేణమ్మగారిల్లని చెప్పింది.

ఆసమయానికే సరీగ్గా సూరి అక్కడవేచియుంది. శ్రీనివాసు
ంత శోభమానంగా- డ్రస్సువేసుకొని- చేతికర్ర పుచ్చుకుని—
ంలు చేరి సూరినుంచున్నచోటికొచ్చి యెదుటిమేడలోకి మెట్లవెం
వెళ్లాడు. అలివేణి తనింటిముందు జల్కా ఆగడంచూసి- మెట్ల
గా నిలబడి శ్రీనివాసుకు నమస్కారంచేసింది- ఆమెనుచూసే
ప్లీడరుగారికి కళ్లు జిగేలుమన్నాయి.

అలివేణి అతన్ని చూచి సూరిచెప్పినంతకంటె అందగాడుగా
ంచడంవల్ల లోపల మురిసిపోతూ—నాలుగు వెండిప్లేట్లతోను—
ండి అరటాకుతోను— ఫలహారాలు—కెంపుకప్పులతో ఓవల్టైన్ తీసు
చ్చిపెట్టింది. కిక్కురు మనకుండా ఊడ్చేశాడు—నువ్వుకూడాపుచ్చుకో
న్నాడు. అలివేణి ఓకప్పులో ఓవల్టైను త్రాగింది. శ్రీనివాసు
ంను ఎగాదిగా చూస్తూ—,

'నేను వ్రాయవలసిన కాకితమేమిటి?'

'కొంచెంసేపు విశ్రమించండి—తాంబూలం సేవించండి''

'చాలా హడావడి చేశావే''

"ఏమీ లేదండీ—ఉడతా భక్తి''

"సరే-నేను మళ్ళీక్లబ్బుకి పోవాలి-సూరి చెప్పినమాటలను బట్టి
ంతమర్జంటని వచ్చాను''

అంటూ అలివేణిముందు-శ్రీనివాసు వెనుక ఆమె శయ్యామం
ంలో ప్రవేశించారు. అలివేణి ఆయనపాదాలనంటి—

నాకే మీవాత్రిత కోతల అర్జంటులేదు-ఈవిధంగా మోసపుచ్చి

మిమ్మల్ని రక్షించినందుకు క్షమించాలి. నేనొక దిక్కులేనిదాన్ని నాపూర్వ చరిత్రయిది-అని కొంతచెప్పి—

ఇప్పుడు నేను గౌరవనీయుని వాత్సల్యంలో వుండాలని సంకల్పించుకున్నాను నావద్ద 20 వేల రూపాయిల రొఖము 10 వేల జవ్హారీ వుంది. అదీగాక నన్ను పెండ్లాడిన భర్తతాలూకు ఆస్తిపే పాడిచెయ్యగా మిగిలింది ఒకటిన్నర లక్షలుండట—నాభర్తనాకోసం వెతికి వెతికి విసిగెత్తి ఆయాస్తి అంతా నా పేరవ్రాసి-పదోపకారంగా మృతిజెందినట్లు తెలుస్తూంది. మనస్సు మీమీద లగ్నమయింది. మీకు అర్ధాంగివున్న దని తెలుసు- ఆమె కేమి అన్యాయంచెయవద్దు. నాస్థిర చరరూపమైన ఆస్తియావత్తు—తమ పేరవ్రాస్తాను. ప్రతిదినము-ఒకసారి దర్శనమిచ్చి 2-3 ఘంటలసేపు నాదగ్గిర కాలం గడిపి వెడితే నాకానందంగా వుంటుంది-తమదయ-నాచిత్తం—అని పాదాలు పట్టింది—

శ్రీనివాసు చాలా సేపు ఆలోచించి-నయందంకూడా చూడడంతోనే నామనసు లగ్నమయింది. నిన్ను జన్మాంతమూ—విడువకుండా - ఆదరిస్తానని- లేవనెత్తి—గాఢాలింగనం చేసుకొన్నాడు. ఆక్రాంత జీవాలు రెండు ముహూర్త కాలంలో ఆత్మైక్యమయి పోయారు.—

శ్రీనివాసు ఆమెకిచ్చిన వాగ్దాన ప్రకారం రోజూ ఆమెయింటికెడుతున్నాడు. ఆమె వాగ్దానంచేసినట్టు శ్రీనివాసు వద్దంటూన్నా బలవంతాన రాసేసి రిజస్టరు చేయించింది.

శ్రీనివాసు సుగుణను మోసగించి అలివేణితో హాయిగా వుంటున్నానుగదా అని చంకలెగరేస్తున్నాడు.

ఆదినం ఆదివారం. సూరి సాయంకాలం శ్రీనివాసుగారింటికెళ్లింది. ఆయన ఒక్కడే వున్నాడు. అమ్మగారేరని అడిగింది. ఆవిడ

వత్తం అనే యోగినిని సేవించడానికి వెళ్లిందని చెప్పాడు. సూరి మాత్రం నమ్మకం లేదు. సూరిచేతులు జోడించుకొని—

అయ్యగారూ! చాకిరీచేసి తింటున్నా నేను తినేది మీఅన్నం- కు ద్రోహం తలపెట్టకూడదు. కాని నామనసుండబట్టడంలేదు. న్నల్లి అమ్మగారు మోసంచేసి పైతిరుగుడు తిరుగుతోంది. ఇప్పు ం ఎక్కడకే. కావలస్తే మీరు వృద్ధుపేటలో కిప్పుడెళ్లండి— ంహాన రావనే రాడీ- ఆకాంగ్రెసు ఆయన— అక్కడేవుంటుందమ్మ ం— నాకు పాపంవొచ్చినాసరే చెప్పకుంటా వుండలేకపోయానంది. నివాసు అనుమానం నిశ్చయమైపోయింది. సూరినింటికి పంపిం డు. ఇప్పుడు కర్తవ్యమేమని ఆలోచించాడు. ఏదో నిశ్చయించు కూర్చున్నాడు.

రాత్రి 9 గంటలయింది. సుగుణ స్నానంచేసి మడిబట్టలతో ంటికొచ్చింది. శ్రీనివాసరావు- ఇంతవరకూ- కూర్చుని లేచాడు. గుణ సరాసరి పూజాగృహం దగ్గిరకెళ్లింది- శ్రీనివాసు భార్యను—

"నువ్వింతవరకూ ఎక్కడున్నావు?"

"దేవదత్తం అనే మంత్రిం నాకుపదేశించిన యోగినిదగ్గర"

"నిజం చెప్పు- లేకపోతే నిన్ను రివాల్వరుతో పేల్చేస్తా"

"ముమ్మాటికీ అక్కడకే"

"వృద్ధుపేటలో ఏయింటిలో వుందావిడ"

ఊరంతా మోగుతుందావిడపేరు"

"ఎక్కడో చెప్పమన్నాను"

"నేనావిణ్ని చూడాలి"

"మగవాళ్ళకి కనుపించదు"

'నాకూడా కనిపించదా?'

"త్రిలోకేశ్వరుడికికూడా కనిపించదా?"

కనిపించదు—

అనంటే శ్రీనివాసు రేపు నేను కూడా వస్తాను నీతో—తీసికెళ్లి చూపించుమంటే—ఇల్లు మాత్రంచూపిస్తాను-మీతంటాలు మీరు పడండని లోపలకెళ్లిపోయింది.

శ్రీనివాసు ప్రతిరోజూ శృంగారించుకొని టిప్—టాప్ గా డ్రస్సు వేసుకొని వెళ్ళడం సుగుణ చూస్తూనేవుంది- అనేక విధాల పరీక్ష చేస్తూనేవుంది అనుమాన పడుతూనేవుంది. తన తప్పు సవరించుకోడానికి చేసే యత్నంకన్న ఎక్కువ యత్నమే చేస్తూంది.—

ఇందులో యెవరు నెగ్గుతారో—

చూడ దలచుకుంటే—

దీని తరువాత కథ

పాంచజన్యములో

చదవండి—!!!

సమాప్తము.

